నవరత్నగ్రంథమాల—మొదటిది.

# శాంతంభూషణం.

ఇది

"ఉన్నమాటంటె యులుకెక్కువ (లేక) ఉడుకు
బోతుదనముకూడదు"

అను గతముద్రితగ్రంథముతో మిళితము.

తెలుగు, ఇంగ్లీషుదీపిక, ఆయుర్భాగ్యవర్ధనీ గ్రంథకర్తయగు
పీఠికాపురసంస్థాన పెన్షనర్
పెద్దాడ చిట్టిరామయ్యగారిచే
విరచితము.



మొదటికూర్పు 1000.

కాకినాడ:
శ్రీసరస్వతీముద్రాక్షరశాలయందు బాకి చినసూర్యారావుచే
ముద్రింపఁబడి
సదరు గ్రంథకర్తచే ప్రకటింపఁబడియె.
1911.

వెల ప్రతి 1 కి నొకఅణా.

# శ్రీసరస్వతీ కార్యస్థానమున వెలకుదొరకుపుస్తకములు.

---

| | రు. | అ. | ప. |
|---|---|---|---|
| మార్కండేయపురాణము | 1 | 4 | 0 |
| కళాపూర్ణోదయము | 1 | 0 | 0 |
| బాలరామాయణము | 1 | 0 | 0 |
| రాజతరంగిణి 1-2 భాగములు | 1 | 0 | 0 |
| కేయూరబాహుచరిత్రము | 0 | 6 | 0 |
| శుకసప్తతి | 0 | 14 | 0 |
| హరవిలాసము | 0 | 8 | 0 |
| శకుంతలాపరిణయము | 0 | 8 | 0 |
| నిరంకుశోపాఖ్యానము | 0 | 6 | 0 |
| విజయవిలాసము | 0 | 6 | 0 |
| రామేశ్వరయాత్రాచరిత్రము | 0 | 3 | 0 |
| బహుళాశ్వచరిత్రము | 0 | 6 | 0 |
| కువలయాశ్వచరిత్రము | 0 | 8 | 0 |
| శృంగారశాకుంతలము | 0 | 8 | 0 |
| పార్వతీపరిణయము | 0 | 8 | 0 |
| కకుత్స్థవిజయము | 0 | 8 | 0 |
| త్రిలోకసుందరి | 0 | 8 | 0 |
| ఎడ్వర్డుపట్టాభిషేకనాటకము | 0 | 6 | 0 |
| చంద్రహాస నాటకము | 0 | 12 | 0 |
| కన్యకాపరమేశ్వరినాటకము | 0 | 6 | 0 |
| మృచ్ఛకటికము | 0 | 12 | 0 |
| ముద్రారాక్షసనాటకము | 0 | 8 | 0 |
| మాలతీమాధవము | 0 | 8 | 0 |
| మల్లికామారుత ప్రకరణము | 0 | 14 | 0 |

| | రు. | అ. | ప. |
|---|---|---|---|
| హాతింతాయి | 0 | 10 | 0 |
| కాంచనమాల | 0 | 8 | 0 |
| విక్రమాంకదేవచరిత్రము | 0 | 8 | 0 |
| చంద్రప్రభచరిత్రము | 0 | 8 | 0 |
| సంస్కృతనాటక కథాసారము | 0 | 12 | 0 |
| ఫసానేఅజాయబ్ | 0 | 8 | 0 |
| శ్రీశివాజీచరిత్రము | 0 | 10 | 0 |
| నన్నయభట్టారక చరిత్రము | 0 | 8 | 0 |
| పరమానంద చరిత్రము | 0 | 4 | 0 |
| అమీరేహంజా | 0 | 8 | 0 |
| భువనమోహిని | 0 | 4 | 0 |
| హరిశ్చంద్రమహారాజుకథ | 0 | 4 | 0 |
| సాహసిక కథార్ణవము | 0 | 6 | 0 |
| ఆనందసాగరము | 0 | 6 | 0 |
| జపానుదేశచరిత్రము | 0 | 6 | 0 |
| కాటన్‌దొరగారిచరిత్రము | 0 | 1 | 0 |
| శ్రీవిజయగోపాలశతకము | 0 | 1 | 0 |
| గుణమంజరి | 0 | 6 | 0 |
| వీరబలవినోదములు | 0 | 6 | 0 |
| శుక్రనీతిసారము | 0 | 10 | 0 |
| కళావిలాసము | 0 | 4 | 0 |
| శ్రీనాథచారిత్రము | 0 | 4 | 0 |
| కన్యాశుల్కము. | 0 | 12 | 0 |
| వివేకానందోపన్యాసములు. | 0 | 10 | 0 |

ఇంకా యితరగ్రంథములు చాలగలవు.

కేటలాగుకు వ్రాసినయెడల నుచితముగా పంపుదుము.

కావలసినవారు

సరస్వతీ మేనేజరు, కాకినాడ, అని వ్రాయవలెను.

నవరత్నగ్రంథమాల — మొదటిది.

# ~~శాంతంభాషణం.~~

ఇది

"ఉన్నమాటంటె యులుకెక్కువ (లేక) ఉడుకు
బోతుదనముకూడదు"

అను గతముద్రితగ్రంథముతో మిళితము.

తెలుగు, ఇంగ్లీషుదీపిక, ఆయుర్భాగ్యవర్ధనీ గ్రంథకర్తయగు
పీఠికాపురసంస్థాన పెన్షనర్

పెద్దాడ చిట్టిరామయ్యచే

విరచితము.

806

మొదటికూర్పు 1000.

కాకినాడ:
శ్రీసరస్వతీముద్రాక్షరశాలయందు బాక చినసూర్యారావుచే
ముద్రింపబడి
సదరు గ్రంథకర్తచే ప్రకటింపబడియె.

1911.

వెల ప్రతి 1 కి నాలణా.

# శాంతం భూషణం.

## మొదటికూర్పునకు పీఠిక.

ప్రస్తుతయుగచర్యలలోఁ గొన్నివిషయములంగూర్చి సంస్కరణమావశ్యకమని తలంచి యందుఁగొన్నిముఖ్యములంగూర్చి వ్రాయఁగలనను సంకల్పముతో నవరత్నగ్రంథమాలలోని మొదటిది పైపేరునఁబ్రకటించుచున్నాను.

ఈగ్రంథము లొక్కొక్కటిగ కాలక్రమమునఁ బ్రకటితమగును. సమాప్తమగునప్పుడు వానినన్నింటింగలిపి గ్రంథమాలంతయు నేకసంచికగ ముద్రింపఁబడును.

ఈగ్రంథముయొక్క ప్రథమకూర్పునందు క్రీ. శ. 1908 సం॥ రమున బ్రకటింపఁబడిన "ఉన్నమాటంటె యులుకెక్కువ." అనువిషయము గల్పబడి "శాంతం" విషయము సంపూర్తిగ నుపన్యసింపఁబడెను.

"పౌరుషంబు దైవంబుతోట్పాటు లేక ఫలముఁబొందఁగ నేరదు" అనునార్యవచనప్రకారము నాయుద్యమముసార్థకమగునటుల దైవమును భజించుచున్నాను.

పిఠాపురం
నవంబరు 1911 సం॥రం

పెద్దాడ చిట్టిరామయ్య.
గ్రంథకర్త.





ఈగ్రంథము చిన్నపెద్దల తారతమ్యజ్ఞానము బంధుమర్యాద మొదలగు సద్గుణములలో వన్నెకెక్కి నాబంధుమిత్ర కుటుంబముల లోను దాసదాసీకుటుంబములలోను వన్నెకెక్కి పుట్టునింట అత్తింట కుటుంబములకు భూషణమై ప్రకాశించి విరోధికృతునామ సం॥ర ఆషాఢ బ ౧౧ తిథియందు స్వర్గస్తురాలైన నారెండవకోడలగు చిరంజీవులగు శ్యామలాదాసుయొక్క ధర్మపత్ని వెంకటానందమునకు నీభూషణమును కృతియొనర్చుచున్నాడను.

నవంబరు 1911 సం॥ పెద్దాడ చిట్టిరామయ్య.



శ్రీరస్తు.

శ్రీగురవేనమః.

# శాంతం భూషణం.

అనగ శాంతమను గుణమొక భూషణము. ఈమాట మనవాడుకలోనున్న చిన్న మాటయైనను దీనియందు గొప్ప ఫలితమున్నది.

"శాంతంభూషణం" అన్నట్లు "వాగ్భూషణంభూషణమ్" అనగ విద్యయే భూషణమనియు, "శీలంపరభూషణమ్" అనగ మంచిస్వభావమె యుత్కృష్టభూషణమనియు జెప్పబడియున్నది.

విద్యాశీలములు అనునవి దేనికదియె మంచివియైనట్లు శాంతగుణమును నొకసద్గుణమె. కాఁబట్టి యదియును భూషణమని వాడుకలోనున్నది. చదువులున్నను సాములున్నను, త్యాగాలున్నను, భోగాలున్నను, శాంతములేక యన్నికలోనికి రాజాలవు. కాఁబట్టి శాంతముం గూడ నొక యుత్కృష్టభూషణమనియె చెప్పవచ్చును.

శాంతంభూషణమనగా శాంతమనుగుణమే నిజమైన యాభరణముగాని యితర రత్నఖచితములగు బంగారు వికారములగు నగలు భూషణములుగావని తాత్పర్యము. అయితే యల్పబుద్ధులగు లోకులకీవస్తువులు గొప్పగాఁదోచి యాభరణములందురు. కాని ప్రాజ్ఞులకట్లు తోచదు. అవి యారోగ్యమును, జవమును, సత్వమును, సౌఖ్యమును, మంచితనమును నీయజాలవు. పైపెచ్చు భీతిని, అనారోగ్యమును, అసౌఖ్యమును, మరణమును, డంబమును, పటాటోపమును గలుగఁజేయును. ఇందుకనుభవమే ప్రత్యక్షప్రామాణము. కోట్లకొలది వరహాలవెలగల దేశనగల శాళిలోనే మనదేశవర్తకోన్నత్యము, కోస్తా వర్తకలాభము శిల్పవృద్ధి, శిల్ప, శేస్యశాస్త్రప్రవీణత, మణిగిపోయెనని మనలోననుభవజ్ఞులును మన స్థితిగతులను గ్రహించిన పరదేశస్థులును జెప్పుచున్నారు. కాఁబట్టి యిట్టిభూషణములు భూషణములుగావు సరేకద పైపెచ్చు దూషణములైయున్నవి. ఇందుచేత సుగుణములే భూషణములని తేలినది. అట్టివానిలో మఱీమంచిదియగుటచేత "శాంతంభూషణమ్" అనువాక్యము సార్థకమై 'భూషణ' మని స్థాపనచేయబడుచున్నది. మనస్థూలశరీరము దానిమీఁద ధరించబడు బంగరునగలు నశించినను యీసుగుణమును దీనివలన లభించు కీర్తియును నశింపవు. ఇట్టి కీర్తియె మనకీర్తి శరీరము దీనికి జరామరణజన్మభయములు లేవు. సూర్యచంద్రాదు లున్నంతకాలము మన్నను.

అంతరింద్రియమగు మనస్సును నిగ్రహించుట శాంతము, అనగ బాహ్యేంద్రియని గ్రహముచేత మనస్సులో నుత్పన్నములగు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములగు షడ్వర్గశత్రువులను నిర్జించుట.

"శాంతం" అనుపదము 'అడగు అడచు' నను అర్థముగల 'శము' ధాతువు నుండి పుట్టినది. అడగునదియు, అడగద్రొక్కునదియు కాగా 'శాంతమ్' అయినది. దొంగకు తేలుకుట్టినపుడు బాధనాపుకొను శక్తియే శాంతము. దీనికి శమము, శాంతి, తాలిమి, తాల్మి, ఓపిక, సైరణ, సహిష్ణుత్వము, సహింపు, సయిపు, సహనము, క్షమ, క్షాంతి, ఓరిమి, ఓర్పు పర్యాయపదములు. అరిష్ట కష్టానష్టములకు నోర్చి శాంతముతో తల్లి పెంచబట్టియేకదా, బిడ్డలు మాతృఋణము తీర్చుకొనలేరనుచున్నాము. ఇందుకేకద తల్లి మాతృదేవతగ బూజింతుము. మనలను మనతోటిజంతు, వృక్ష, ఖనిజకోట్లను నోర్పుతో మోయబట్టియేకద యీభూమిని 'భూదేవత' యని, పంచమాతలలో మాత యని భూదేవికి మ్రొక్కుచున్నాము. ఇట్టి క్షమ భూగోళమను గ్రహమందుండుటచేత భూమికి 'క్ష్మా' 'క్షమ' యను సార్థకనామములు గలిగెను. ఆదికాలమునో జనులు నౌకాయాత్రలు సలిపినపు డోడనావికులకును, నోడయాత్రార్థులకును దుఫానుల, కరటముల చలనములేకుండ శాంతముగ నాస్ట్రేలియా అమెరికాఖండముల మధ్యసముద్రముమీఁద నోడయాత్రలుజరుగుటచేత నాసముద్రమునకు శాంతమహాసముద్రమ (PacificOcean) ను పేరుగలిగెను. శాంతగుణముచేత నేకద కౌరవవంశజుడగు పాండురాజు జ్యేష్ఠపుత్రుండగు ధర్మరాజునకు భారతయుద్ధమున జయముగలిగెను. ఇందుకు వేమనపద్యము.

క. శాంతమున సర్వకార్యము, సంతోషంబునను బొందు సత్యము జయముల్
పంతములు చెల్ల ధర్మజు, డెంతటికష్టముల బడి జయించెనువేమా.

సంసారము వదలి సర్వత్యాగియను సార్థకనామముగల సన్యాసి కోపిష్ఠియైన యెడ (అనగ శాంతములేనివాడైనచో) చండాలుడందురు. ఇందుకు గ్రామ్యశ్లోకము. "పక్షిణాం కాకిచండాలో మృగానాం గార్ధభ స్తథా యతీనాం కోపిచండాలః సర్వచండాలదుర్జనః" మఱియును శాంతములేని తపస్సు వ్యర్థమనియు, శాంతమె తపస్సనియు, శృతమునకు శాంతంభూషణమనియు, క్షమకవచమనియు, తనకోపము తనశత్రువనియు, తనశాంతము తనకు రక్షయనియు, సుమతి, వేమన, భారవిభట్టాది కవులు చెప్పుచున్నారు. వేయేల శాంతమె భగవత్స్వరూపమని భక్తులుదలంతురు.

"శ్లో. శాంతాకారం భుజగశయనం పద్మనాభంసురేశం
విశ్వాకారం గగనసదృశంమేఘవర్ణంశుభాంగం

లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం
వందేవిష్ణుం భవభయహరం సర్వలోకైకనాథం.

పరాక్రమవంతులగు పాండవులు దుర్యోధనాది నూర్వురు సోదరులను వారిపక్షమువారగు నక్షౌహిణీలకొలది జనంబును సంహరించియును, వీరాగ్రగణ్యుఁడగు శ్రీకృష్ణ భగవానులు రాజసూయాధ్వర వేదియ మహాసభయందు శిశుపాలుని నిండోలగమునందు వధించియును శాంతముయొక్క మహిమాతిశయమును ప్రకటించిరి.

రాజు ప్రజలను, గురువు శిష్యులను కప్తాను నావికులను, సేనాధిపతి సైనికులను, మగడు ఆలిని, తలిదండ్రులు బిడ్డలను, యజమాని నౌకర్లను, శిక్షింపను, రక్షింపను క్షమియింపను సమర్థులు. ఇట్టి స్థితిలో శిక్షలువేయు శక్తి గలిగియుండియు క్షమించుట వలన వీరికి సిద్ధించు మంచిపేరు వెల్లడియై గౌరవమును దెచ్చుచున్నది. ఇప్పటి మన బ్రతానియావారి పాలనయందుం గూడ కొన్ని నరహత్య మొదలగు కేసులలోని నిజము దెలియనపుడున్నత న్యాయాధిపతిగారుపబ్లికు ప్రాసిక్యూటరుదరఖాస్తుమీద ముద్దాయిలలోనొక్కనిలేక కొందఱినికేసుయొక్క గూఢతను భగ్నముచేసిసత్యమును బయిట దీయుటకై “ నీ నేరమును క్షమించెదము సత్యము చెప్పుము ” అనిబహిరంగముగ న్యాయపీఠముననుండి విచారణకాలమందు నిండోలగమున గంభీరస్వరముతో వాగ్దానము చేయుట మనము చూచుచున్నాము. క్షమా (Pardon) శబ్దము (“To Erris human and to for give divine”) “ తప్పుట మానవధర్మము క్షమించుట దైవవశము ” అను మహావాక్యముయొక్క యుత్తరార్థ ప్రకారము భగవంతునికి జెల్లునుగాన మన బ్రతానియాదొరతనమువారి పరిపాలనలోనున్న న్యాయతీర్పరికి నీయధికార మీయఁబడుటచేత వారి ధర్మపరిపాలనా మహిమకు “ క్షమ ” నిషాన్ (Index) గానున్నది. శ్రీమహాభారతమున జెప్పిన

“ గీ. చెల్లియుండియుసైరణచేయునతఁడు । పేదవడియునుసర్థికిఁ బ్రియముతోడఁ
దనకుఁగలభంగి నిచ్చునతండు బుణ్యు । పురుషు లనిసెప్పిరార్యులు బుధవరేణ్య”

అను పద్యప్రకారము చెల్లియుండియు క్షమించువాడును తన కున్నదానిలో లేదన కిచ్చువాడును పుణ్యాత్ములని చెప్పుదురు. చెల్లియుండియు క్షమించు పుణ్యపురుషులు ద్వాపరయుగమునయు ధర్మజ కృష్ణాదులవలె నీకలియుగమునందు వేమలవాడ భీమకవి మిక్కిలి ప్రసిద్ధుఁడు. ఈక్రిందికథలురెండు నత్యాశ్చర్యకరముగా నాతని శాంత మహిమాతిశయమును బ్రకటించుచున్నవి.

మొదటిది. శృంఖులదీవిపపు రాజునొద్దకు భీమకవి తన శిష్యుడైన భట్టు మల్లప రాజుచేత రాజధర్మనార్థమై వచ్చుచున్నానని వర్తమానమంపగ భీమకవివచ్చిన భయ మేమనెను. పిమ్మట నిర్భీమకవి వచ్చుచున్నాడని వర్తమానమంపగ నూరకయుండెను. రాజు సన్మానము చేయడనియు, చూడవలదనియుఁ గొందరు చెప్పినను వారిమాట విన క రాజసందర్శనార్థము రాజసభలోనికింబోవ ప్రభువాతని సన్మానముజేయక యుం డుటయె గాక నిల్వబడియుండగ నీవెవరని యడుగగఁజెప్పినపద్యము:—

సీ॥ గడియలోపలదాడి గదసిముత్తునియగా దిట్టినమేధావి భట్టుకంటె
రెండుగడియల బ్రహ్మ దండిముండ్లెల్లను ముల్లదిట్టినకవిమల్లుకంటె
మూడుగడియలలోన మొనసయెత్తినగల్లు పగలదిట్టినకవి భానుకంటె
అరజాములోపల చెరువులోనీళ్లింకఁ దిట్టినబడబాగ్ని భట్టుకంటె
నుగ్రకోపియేను నోపుదుశపియింప। గ్రమ్మరింపశక్తి గలదుమాకు
దిట్టిమానుయిరుగు జెట్టింప గిట్టింప। బిరుదువేమలాడభీమకవిని.

ఇందుకు రాజడిగినప్రశ్న.

క॥ స్వస్తిగఁబలికెదభీమన। వస్త్రాదుకవీంద్రుడవైనవరసభలోనన్
బ్రస్తుతనూతనఖచితం। బీస్తంభంబునకునిగురు ఏదనితెన్నైన॥

అని యడిగిన నతనిజేసి మొగంబిడి భీమకవిచెప్పిన పద్యము.

క॥ అలాగెశృంగలభూపాలోత్తమయుష్మత్ప్రభు పద్మముదానిన్
పోలమినంటేయుంచుము నావేమలవాడ భీమనాథఃకరణన్॥

అని చెప్పి స్తంభమువై పునకుదిరిగి దానింబిలచి చెప్పినపద్యము.

శా॥ ఆనీతానుపమానశృంఖులపదాబ్జాలంభితస్తంభమా
ఏనేవేమలవాడభీమకవినే యీచిత్రకూటంబులో
భూనవ్యాస్తితపల్లవోపలతికా పుష్పోపగచ్ఛంబవై
నానాపక్వఫలప్రదాయివగు మాయాకల్పభూజాకృతిన్॥

అనివచించిన నమ్మహాకవి యీశ్వర వరప్రసాదలబ్ధవాక్పటిమాతిశయము చేత నా స్తంభంబు వృక్షంబై యంతరిక్షంబుకేసి రాజుకాలితో పెరుగుచున్నంతలో రా జు కవిశ్రేష్ఠుని శరణమువేడ వానిచేత నవమానితుండైయ్యును దారుడుగానభీమకవియు నుగ్రహించి శాంతచిత్తుఁడై స్తంభమునుగూర్చి మరల బిలచి చెప్పినపద్యము:—

ఉ॥ "శంభువరప్రసాదకవి జాలవరేణ్యుఁడనైననావచో
గుంభనరిత్తి నేయు కనుకూలతనొంది తనూనభావమై

కుంభినియేలు శింగనృపకుంజరుమూంగిట మొల్ల సాలలో
స్తంభమువై ననీచెలువు దాల్పవె యెప్పటిమాపుచూచెదన్'' ॥

అని శాసించిన నాస్తంభం బెప్పటిస్తంభంపయ్యె. అనంతరము రాజు లేచుటకుఁ బ్రియత్నించగ కాలు రానందున రాజు కవీంద్రు బ్రార్థింప కాలువచ్చుటకు రచించిన పద్యముచేత కాలు వదలిపోయెను.

రెండవదృష్టాంతము :—ముత్యాలగోనె నిమిత్తము సముద్రుని జబర్ దస్తుతో భీమకవి పిలచి యడిగిన పద్యము.

సీ. సీతావియోగాగ్ని చే నెంతఁ గనలెను రాముని శాణతీవ్రానలంబు
నలస ప్తవారధులాపోశనముగొన్న కుంభసంభవుమహాకోపవహ్ని
చలమింతయును లేక సర్వకాలంబును బలిమిమై గ్రాగెడిబాడబంబు
నెన్నడామూడగ్ని లేక నూనందాక నంతకన్నను మాది యతిశయంబు
ఎఱుగవావార్నిరాజనాబిరుదుభువిని, ఏను వేమలవాడభీమేశుకరుణ
గలిగి వెలసిన భీమసత్కవిని సుమ్ము, వేగనాముత్యపుగోనె వెడలనిమ్ము.

ఇట్లు పిలచి చెప్పినవెంటనే సముద్రుఁడు ముత్యపుగోనెనందిచ్చెను. ఇట్లు గోనె తిరిగి లభింపగ దానిసంగ్రహించి మోయించుకొని పోవుచుండగ లేటవరపు కేశరాజను శాయసవ్యోగస్థుడు గోనెమీద శాయసపన్ను (ఇప్పటి టోలుగేటువంటిపన్ను) చెల్లించుమని యటకాయించి భోజనార్థమై తనగృహంబునకు వెళ్ళెను. కవీంద్రుండు కేశరాజున్నాడాయని యడుగ లేడనువార్త విని చెప్పినపద్యము ;—

క. కాటికికట్టెలు సేరెను, ఏటావల కొంద ఉండి యేడ్చెదరేమో
పాటించి పిలుకనూరను, లేటవరపు కేశరాజు లేడాలేడా.

అని శపియించినట్లుగనే కేశవరాజు మృతినొందెను. అంత నాతని చుట్టములు జేరి భీమకవి శరణమువేడిన వ్వాని క్షమియించి తిరిగి వానిం బ్రతికించినపద్యము ;—

క. నాటికి రామునితమ్ముడు, పాటిగ సంజీవిచేతఁ బ్రతికినకరణిన్
కాటికి జననీకేటికి, లేటవరపు కేశరాజ లెమ్మా రమ్మా.

ఇట్లుచెప్పి బ్రతికించి ముత్యములు బట్టించుకొని నిజగృహంబుఁ జేరెను. [ఈరెండుదృష్టాంతముల సంగ్రహము కృష్ణామండల రేపల్లెతాలూకా మోదుకూరు, భల్లం అమ్మిరాజుపద్యుండి సంపాదింపబడెను]

[ ఇంక నీసత్కవీంద్రుని మహిమ వినగోరువారు వ్యాఘ్రాంశద్వంశ్రుల చరితములో రణతిక్కమంత్రిచరిత్రము చదువవగు.]

ఇక సామంతులుకానివారగు నీచులవిషయములో, "గుడ్డికన్ను తెరచిననేమి మూసిననేమి" అను లోకోక్తి ప్రకారము వారికి చెల్లుబడియునులేదు. క్షమించుటయునులేదు. అయినను నట్టి యల్పులలోఁ గొందఱికిని, పయిం జెప్పిన నధికులలోఁ గొందఱికిని, ఉడుకుబోతుతనము (ఉలుకు=ముక్కోపము) అను నొక పేలవగుణము దయ్యమువలె నావహించి లోకుల దూషణకును పరిహాసమునకును పాల్పడులాగునఁ జేయుచున్నది.

ఈవిషయముంగూర్చి నేను వ్రాయుచున్న దినమున మూడేండ్లవయసుగల నాపౌత్రులలో నొకడు.

"ఉడకుడుకుబోలి"

యని తిరుగులాడుచు పల్లవిపాడినట్లరచుచుండగ నాకువినఁబడి యత్యాశ్చర్యముగలిగెను. ఈయల్పగుణమతిబాల్యావస్థ మొదలుకొని ముసలితనముదనుక కొందఱికి నాటుకొనియున్నది. ఈనీచగుణమునకు "ఉన్నమాటంటె యులుకెక్కువ" అని మఱియొక పేరుగలదు.

## ఉన్నమాటంటె యులుకెక్కువ లేక యుడుకుఁబోతుదనము కూడదు.

ఉడుకుఁబోతుఁదనమనగా వేడిమిచేగాని, కోపకారణముచేగాని, పొంగి బోరగిలబడు గుణము. ఇది స్థావరజంగమములందు గలదు. గింజ లుష్ణస్పర్శముచేత పేలి రాలిపడును. సున్నపు గుల్లమీద నీరుజల్లిన బుసబుస పొంగి బోర్లఁబడును. పాలు మొదలగు ద్రవద్రవ్యము లిట్టులనె పొంగి దిగజారును. ఒక యాఁబోతునుజూచి "దుత్తిచ్చి" యని కేకవేసిన మోరెత్తి ఘణిల్లని రంకవేసి సంభ్రమముతో నెదిటికై దిక్కులు చూచుచుండును. ఇటులనే "ఉసాకూ" యని ప్రేరేపించబడినకుక్క "బొయిబొయి" యని మొరిగి యెదిరి మీదికి పరుగిడును. అత్తిపత్తిచెట్టు చూచితివా? చేయి తగిలిన మాత్రమున ముడిచికొనును.

'ఉన్నమాటంటె యులుకెక్కువ' అన్నటుల కొందఱు మనుష్యులయందీయులుకు నెన్నుపామువలె వెంటనంటి హేత్వంతరమున బయల్పడును. బడలిన మనుష్యుని 'బక్కడా' యని తెలివిహీనుని 'పెయ్యమ్మ' యని పిలచిన మిట్టిపడును. సీమలోకూడ ముసలిదానిని 'క్రోన్' అని పిలచిన కొరకొరలాడును. ఈగుణములు గలవారిని నుడుకుబోతులందురు. వారికిది తేలుకొండి పోటువంటిది. కోపోద్రేక కరములగు నిందలు సకారణముగా బ్రయోగించిన నపరిమితు లగువారుదక్కఁ దక్కినవారు భరింపజాలరు. అట్టిసంగతులలో నిష్కారణముగ నాక్షేపించిన లేక తిట్టిన నోర్వగలరా? ఓర్వజాలరు.

ఇట్టినింద లటుండనిమ్ము. రంగడను నొకనికి పుట్టుకతో గుడ్డితనము తటస్థించి యతడు దారింబోవుచుండ 'ఓగుడ్డీ' యని వెనుకనుండి యాపుట్టంధుని మీరు బిలచినపుడు అతడు పరమశాంతుడైనచో 'ఇది యున్నమాటగాని నిందకాదుగద. అన్నవాని తప్పేమున్నది. తక్కినవారినుండి వివేక్షింప నన్నిట్లు పిల్చుచున్నాడు. నన్ను పెట్టుపేరుతో పిలువక పుట్టుపేరుతో పిలిచెను' అని భావించి వెనుక తిరిగి 'ఓహో' యని మారు బలుకవచ్చును. కాని నిందారోపణముగా భావింపడు. ఒకవేళ నది బాధాకరమని తోచిన యెడల 'ఇదిమన స్వకృతదోషమువలనఁ గలుగలేదుగద. జన్మాంతర ప్రారబ్ధ మనుభవింప వలసినదే' యని మనస్సునందె వితర్కించుకొనును. అట్టి యంధుండు కోపదారియైన 'ఏలనట్లందువు. ఈగతి నాకు గతజన్మలో నెవ్వని గుడ్డివానిగ జేసితినో లేక నీవలె నెవరిని పరిహసించితినో నేననుభవించుచున్నానుగద. ఇపుడు నన్ను పరిహసించు నీగతియును ముందిట్లై యగున' ని నిరసించును. ఆపుట్టంధుఁడు ముక్కోపియైన నదరిపడి వానిం దిట్టుచు మీదఁబడి కొట్టఁబోవును. లేక కొట్టఁబోవునంత యుగ్రతను జూపును.

ఈయుడుకుఁబోతునం దొక సాంకేతిక లోపముండి వీనికి తరుచు కుళ్ళుచీమిడిని చీదుకొను నలవాటైనయెడల వీని స్వభావమునుబట్టి జనులు 'శివాసనముక్కు' అని వాని నుద్దేశించి పిలిచినయెడ నాముక్కోపి యెంత యాడంబరముతోఁ దపించునో యూహింపుడు. ఆపిల్చినవాఁడు చేతి కందినట్లయిన వానిఁగొట్ట నుంకించును. అందకబోయిన రాలు రువ్వును, తిట్టును, మఱి చేయగల ప్రతిఘాతములం జేయును. తుదకు వానిమీద నభియోగముం దెచ్చును. ఇట్టివాని గుణచేష్టల నెఱుంగని వాడొకఁడు ప్రస్తావ వశమున నతాత్తుగ 'ముక్కు' అని స్మరించినయెడ వానింగూడ దిట్టును. ఈసందర్భమున మఱి కొన్ని వింతయోగములు తటస్థించి ఈవిషయముతో జేరును. ఎప్పుడైన నీయల్పగుణము గల యుడుకుబోతుతో 'అయ్యా దాహమగుచున్నది మజ్జిగ నిప్పించగలరా' యనగ మజ్జిగ! మజ్జిగ! మజ్జిగలేదు! మజ్జిగలేదు! మంచినీళ్ళు ఇచ్చెదను త్రాగుము. అని మారు పల్కినపుడు పిపాసార్థితుడు నీరొల్లక మరల 'మజ్జిగయ్యా' యని యరచినయెడల నాముక్కోపి కండ్లెఱ్ఱజేసి ''ఇంకొకమాటు మజ్జిగ యనిచెప్పు! ఏమిచేసెదనో'' యనినపుడు వాఁడు నిరాశుడై పోవుచు చప్పనాతితనముచేత 'మజ్జిగ! మజ్జిగ! యని కేకలిడుచు పరుగెత్తును. అపుడా యుడుకుబోతు వాని వెంటదరుముటయును నా కుపిత పిపాసార్థి వానిం ద్వేషించి యామాటచేత మఱిమఱి పరిహసించుటయును ఘటించును. ఈపిపాసార్థి మఱియొకప్పుడు తన జతగాండ్రతో నిదిచెప్పి వారిని వెంట తీసుకొని మరల యాకోపిని చూచినపుడామాటతోనే తన స్నేహితులను గలసి వానిమరల నుడికిం

చును. ఇట్టి మజ్జిగపేరు చెప్పగ నామహానుభావుండుడుకుననుప్రతీతియిరుగుపొరుగు పల్లెల పట్టణముల వ్యాపించును.

లక్ష్యములు (దృష్టాంతములు)

1. చెన్నరాజధానిలో గోదావరిమండల పీఠపురియందు అప్పల అనంతయ్యయను నొక బ్రాహ్మణుండు కలడు. ఈతండెట్లో 'గోవింద' యన్నంతమాత్రమున కోపముతో మండిపడుట తెలిసి యిరుగు పొరుగువారు 'గోవిందా' యని యెగతాళిగ కేకలు పెట్టనారంభించిరి. సామాన్యుల కిదియొక రక్తిగనే యుండెను. తన్ను కొందఱు తుంటరివిద్యార్థు లుడికించు చుండిరని వారి గురువులతో నాయన పెట్టుకొన్న మొఱ్ఱలంతగా పనిచేయలేదు. తనకు నాపీఠికాపుర సంస్థాన ప్రభువుల యెదుటగూడ సేవకులు తన్నేడ్పించు చుండిరని మొఱ్ఱిడెను. ఆబ్రాహ్మణుంజూచి 'గోవిందయనిన నీకేల కోపము' ని యాప్రభువుగారడిగిన 'అయ్యా తమరుంగూడ నాలాగే సెలవిచ్చు చున్నారా' యని విముఖుడై తొలగిపోయెను.

2. పీఠనగరమున 50, 60 సంవత్సరములకిందట మాయూరు గ్రామ శేషావధానులను వైదికబ్రాహ్మణుండుకలఁడు. యజుర్వేదము క్రమాంతముఁజదివెనుగాన పూజ్యుఁడు. ఏకారణనో 'భాగరాజు' అని పేరెత్తిన మండిపడును. ఈయన విసికి వేసరి తుదకు పీఠికాపుర సీమకరగ్రహి కంచి రామన్నపంతులు (సబుమేజస్ట్రేటు) గారి యెదుట తన్నుడికించిన పదియార్గురు పరిచారకులమీద నభియోగముం దెచ్చెను. అందు మొదటి మహానుభావుండు గుల్లాచారి నిత్యమంగళుడు. ఉభయ వాదులకును సాక్షులకును సమావేశోత్తరవులయి యభియోగశుర దివసంబున సందడు సమావేశమైరి. న్యాయకర్త పదియార్గుర గుంపుకేసిచూచి 'మీరందరా బ్రాహ్మణుని యెగతాళి చేయుచున్నారేమి? ఇది బాగాయున్నదే? ఎంతపని చేసితిరి?' అన్నంతలో నాయవధాని యామాటలలో 'బాగా' యను పదమునుబట్టి యాయధికారిగూడ 'భాగరాజు' అని తన్నపహసించినట్లు భావించి యాయనదిక్కు చూచి 'అయ్యా తమరుఁగూడ 'భాగరాజు' అని యెగతాళి చేయుచున్నారా' యని దిగ్గునలేచి యవతలకుం బోయెను.

3. పీఠికాపురమున కనకపల్లియను క్షౌరకుడు గలడు. ఏహేతువుచేతనో పొరుగు యల్పకులీను డొకడు 'తమ్ముడా నేను మాయింటికి పనికై రాగలవా' యని యడుగఁగ వానిమీద నెగిరిపడి 'నీవు నాతండ్రికి నాకంటె ముందు బుట్టితివాయేమి?' అని తిట్టుచు విముఖుఁడై వెడలిపోయెను. నాటి తుదమొదలు 'తమ్ముడా, యని కొందరును 'కనకపల్లి తమ్ముడా' యని కొందరును పామరజనులు వానిం బిల్వసాగిరి. అల్ప జాతీయుఁడ

గుటంజేసి వారిందూరుచు సేవ్పులతోను పెడబొబ్బలతోను భూమిమీద సాగిలఁబడి దొర్లును. ఇదియును జూచువారలకు నొక చోద్యముగనుండెను.

ఊడఁకునట్టి దుర్బలజాడ్యమునకును ఉడికించెడు కొంటెతనమునకును చికిత్సలు.

1. ఘోసాయి చిటికివంటిది:- నీకేసిచూచి యెగతాళిమంత్రము నీకర్ణశూలముగ ప్రయోగించునప్పుడు లేని శాంతముఁ దెచ్చుకొని అట్టహాసముతో యామంత్రమునే హెచ్చుహేళనస్వరముతో ప్రతివాదికి భయంకరముగ వానికేసి మరల ప్రయోగింపుము. ఇప్పుడు విసుకుదల, ఉడుకుఁబోతుగుణము దిగమ్రింగునట్టి శాంతము, నేర్పుతో గలిగియున్నం జాలును. ఇదియు కొంటెవారి యస్త్రమునకు ప్రతీకారమగు నారాయణాస్త్రము వంటిది. ఇట్టి ప్రతిహతమువలన పరిహసించువాని వాక్పటిమ చెడును. పట్టుదలతో నీవీ యుద్ధముఁ సాగించినయెడ వెక్కిరించువాని కొక్కిరతనము చక్కఁబడును. ఇది తూటాలయుద్ధములో తూటాసరు కయిపోయినవాడు యెదిరి తూటాబట్టి గురిపెట్టి తిరిగి విసరినట్లుండును. ఈమంత్రరహస్యము లక్ష్యములో నుంచితివేని జయశాలి వగుదువు. తుదకు లోకులు నిన్నే మెచ్చుకొందురు.

2. యెగతాళిచేయువారు తమ సంరక్షకుల లేక గురువుల శిక్షలోనుండి విద్యార్థులైనయెడ సామభేద దండోపాయములచేత సులభముగ కుదురుబాటులో నుంచబడవలయును. అటు కానియెడల దేశముయొక్క మంచిచెడ్డలకును ప్రతిష్టాప్రతిష్టలకు నుత్తరవాదులా సంరక్షకులు గురువులు నగుదురు.

ఫలితార్థము.

'శాంతం భూషణం' అను మహావాక్యానుసారముగ ప్రహ్లాదాది మహాభక్తులుచూపిన ప్రశాంతమును జ్ఞప్తియందుంచుకొని యీక్రింది పద్యరీతిని సుఖము నొందుడు.

గీ. ఉడుకనుడుకంగనెక్కడో నుడుకుబోతు
దనముగావున జనులార ధైర్యమూని
శాంతనారాయణాస్త్ర ప్రశస్తులగుచు
సర్వశత్రులగెల్చెడు శక్తిగనుడి.

మరియు కార్యసిద్ధికై తరివేచియుండు విషయములలోగూడ నీశాంతము సంబంధించియుండునుగాన నీక్రింది యుపదేశమును మెలకువతో లక్ష్యపెట్టినయెడ కోరిన కోర్కెయీడేరును.

*కం. కష్టములకంటె నెక్కుడు, కష్టముతరివేచియుంట కడువృద్ధునకున్
కష్టంబనక సహించిన, నిష్టార్థము దీరకుండు నే యెప్పటికిన్.

"ఉన్నమాటంటె యులుకెక్కువ లేక ఉడుకుబోతుతనము కూడదు" అనుపేరు గల సదరు చిన్నపుస్తకము క్రీ. శ. 1908 సంవత్సరమున నాచే రచింపబడి మొదటికూర్పు 200 ప్రతులు మాత్రము ముద్రితమై పిఠాపురమునం బ్రకటింపంబడెను. ఇందలి కథానాయకులు, చాలామంది పీఠపురవాసులగుటచేతను, ముమ్మొందచటనే బ్రచురమగుటచేతను శానా ప్రతులచటనే వ్యాపించి వ్యయపడెను.

పిఠాపురనివాసియగు మాయుపవిలేఖకుడు ఏలిసె లనకులభించిన మొదటికూర్పుతాలూకు ప్రతి నిరుగుపొరుగువారికిం జదివి వినిపించి వ్యాపింపంజేయంగ నందు ఎక్సువైజడ్డను వానివిషయమై గొప్ప మేలు దటస్థించెను. ఈపుస్తకమునయుగ్రకోపము నడంగం ద్రొక్కు నుపాయములలో మొదటిదానినిం బ్రయోగించగ నట్టి మేలాతనికి లభించెను. అదెట్లులభించెనో యాతనిసిఫ్ఫు ఏలిసె నాకేరట 10-11-1908 సం॥ తేదిని వ్రాసి పంపిన జాబుయొక్క సంగతులవలన మాచదువరులకు విశదమగునుగాన వానినొల్లుదహరించుచున్నాను:—అజాబు వ్రాసిన తేదికి పూర్వము నెలదినములక్రిందట మాయుపలేఖకుడు స్వయముగా నాపుస్తకము చదివినసంగతులు గ్రహించి యాపుస్తకము లోకోపకారమైనదని తన యనుభవసిద్ధముగాం జెప్పగలననియు - ఏలనన - ఆమధ్య సదరు ఎక్సువైజడ్డనువాండు ప్రతిరోజున ఆకలింతవచ్చినప్పుడల్లా రంగా, రంగాయనుట యతనిస్వభావమై యుండెననియు యట్లుండగా తనసాపులోం పనివాండ్రు ఒంకా కొందఱు తగుమనుష్యులుండగా ఎక్సువైజడ్డకు నాకలింతవచ్చి రంగా, రంగా యనగ వినిన పనివాళ్ళలో కొందఱు అతనిని చూచి హేళనగ రంగా రంగాయని యరచినారనియు అందుమీద నతండు కోపించి ఆశబ్దము పలికినవారిని తిట్టుటకు నారంభించెననియు తిట్టినకొలది చూచినవాండ్రందఱును రంగా రంగాయనుచు నుండెడివారనియు, ఆశబ్దము నతని మనస్సునకు నెంతో కోపముగానుండి రాళ్ళురువ్వుటకుం గూడ నారంభించెననియు ది 23-10-08

*ఈపద్యము ఆ 1908 సం॥ ఆగష్టు 1-2 తేదీలను పిఠాపుర ప్రభువులగు మ॥ రా॥ రా॥ శ్రీ శ్రీరాజారావు వేంకటకుమార మహిపతిసూర్యారావుబహద్దరువారు పీఠనగరంబున బ్రహ్మశ్రీ సెమలూరి వెంకటశాస్త్రిగారిచేత శతఘంటావధానము జరిపించు తరుణములో 77 వ లేఖరి కడువృద్ధుండగుటచేత తనవంతు వచ్చునరకు కష్టముతో వేచియుండి 'తరివేచియుంట' అష్టకష్టములకంటె నెక్కుడు కష్టమని దెల్పు కందము రచింపుడని కోరగా కవివరుండు రచియించినది.

తారీఖున సాయంకాలము 6½ గంటలకు ఏబిసి యొక్క పాఠ్రునకు సరకు వచ్చియుండగ, డివీ అను కుఱ్ఱవాడొకడును, యన్వ్యస్సనువాడొకడును రంగా రంగా యని యఱచిరనియు ఆశబ్దమువిని వాండ్రను బండబూతులు తిట్టుచూ ఎబిసి యింటికి చేరవుగానిస్నా యస్సార్‌గారి నూతియొద్ద కూర్చుని రంగా రంగా అనువాళ్ళు ఈమార్గమున రాగలరు వాళ్ళకు బుద్ధిచెప్పెదను అనియును ఒకనికి బుద్ధిచెప్పితే యందఱకు బుద్ధి వచ్చునవియు గట్టిగా కేకలు వేయుచుండగా ఆసమాచారము ఏబిసీకి తెలిసి ఆకుఱ్ఱవాండ్రను మఱియొక మార్గమున పంపించివేసి యామరునాడు 24-10-1908 తేదీని ఎక్సువైజడ్డును పిలిపించి మ॥శ్రీ పెద్దాడ చిట్టిరామయ్యాగారు రచించిన పుస్తకము వింటివాయని ఆరంభము మొదలుకొని యంతమగువరకు చదివి అందలి యంశములు అతని మనస్సునకు పట్టులాగు బోధపరిచితిననియు ఆమహామంత్రము గ్రహించినవాడై యామరునాడు తన్నుచూచి రంగా రంగా యని యగచేవాళ్ళ యొద్దకువెళ్ళి రంగా రంగా యని వాళ్ళకంటె నెక్కువగా కేకలు వేయ నారంభించినాడనియు క్రమముగా నాలుగుదినములకు అదివరకు తననుచూచి హేళనచేసేవాండ్ర కేకలు అణగినవనియు ఆలగాయతు యెవరు అరచలేదనియు, అదివరకు పది పన్నెండు దినములనుండి కుఱ్ఱవాండ్రందరు తనను రంగా రంగా యని పరిహసించితే తనకు కోపము హెచ్చిపోయి యొకనికి తగిన ప్రాయశ్చిత్తము చేస్తేగాని వాండ్రు మానరని తనమనస్సులో మిక్కిలి కోపముగానుండెడిదనియును అటువంటి తొందరలో నున్న తన మనస్సు నెమ్మది పడుటకై చిట్టి రామయ్యాగారు రచియించిన పుస్తకమువలన తాను జ్ఞానము కలవాడై యేలోపము లేకుండ జరిగినందుకు చి॥ రా॥ గారికి వందనములు చేసిదననియు ఎక్సువైజడ్డు తనతో చెప్పెనని ఏబిసి సదరు జాబు వ్రాసి నాకుఁబంపెను.

మహాజనులారా! తెచ్చిపెట్టుకొనినదైనను శాంతము విలువలేని భూషణమని యీ కథవలన మనకుఁ దెలియుచున్నది. దీనిం గ్రహించువారు ఈమహాభూషణముయొక్క మహిమాతిశయమును కలకాలము పాటింతురుగాక.

ఇంక నొక్కమాట :—త్యాగయ్యగారిమాట :—పరమభక్తుఁడును, గానవిద్యాశారదుండును, గాన రసికుండును త్యాగరాయకృతులని ఖ్యాతిగాంచిన త్యాగయ్యాగారిపాట :—

[చదువరులారా! శాంతముతో గమనింపుడు, గానము నేయుడు, ఆనందింపుడు.]

సామరాగము - ఆదితాళము.

పల్లవి॥ శాంతములేకను సౌఖ్యములేదు సారసదళనయనా॥

అనుపల్లవి॥ దాంతులకైన వే । దాంతులకైనా॥ శాం॥

చరణములు.

1 ఆగమశాస్త్రము । లన్నియుజదివిన బాగుగ సకలశా । స్త్రాభయముఁ దెలిసిన॥ శాం॥

2 యాగాదికర్మము । లెన్నియుఁ జేసిన । బాగుగ వెలయు వి । రాగులకైనా॥ శాం॥

3 రాజాధిరాజమా । రాజగురుత్యాగ । రాజవినుతరక్షకునికైన॥ శాంతములేకను॥

ఇట్లు, విన్నవించు

బుధజనవిధేయుడు,

పెద్దాడ చిట్టిరామయ్య.



## THE SARASWATI. శ్రీసరస్వతి.

పదమూడు సంవత్సరములనుండి ప్రకటింపబడుచున్నది.

### RATES OF SUBSCRIPTION

(*Including of postage.*)

For one year **(in advance)** Rs. 3 0 0

Single copy ... „ 0 4 6

For *Bona-fide* students, females and village school masters, the annual subscription, if paid in advance Rs. 2 only.

చందానిర్ణయము. (అంచెకూలితోడ)

సంవత్సరమునకు (ముందుగాఁ జెల్లించిన) రు 3-0-0. విడిప్రతి యొకటికి రు 0-4-6

విద్యార్థులకును బల్లెటూరి యుపాధ్యాయులకును స్త్రీలకును సంవత్సరమునకు ముందుగాఁ బంపినయెడలఁ జందా రెండురూపాయలు మాత్రమే.

ఈపత్రికను గోరువారును జందాధనము పంపువారును గ్రంథములఁ గొనువారును, సంగతులు తెలిసికొనఁగోరువారును సరస్వతీమేనేజరుగారికి కాకినాడ వ్రాయవలెను.

# బ్రహ్మశ్రీ శతావధానులు తిరుపతివేంకటేశ్వరకవుల గ్రంథములు

| | రు. అ. ప. |
|---|---|
| ప్రబంధములు. | |
| శ్రవణానందము | 0 10 0 |
| పాణిగృహీత | 0 13 0 |
| లక్షణాపరిణయము | 0 6 0 |
| బుద్ధచరిత్ర | 0 10 0 |
| వేంకటేశ్వరవిలాసము | 0 10 0 |
| రసికానందము | 0 1 6 |
| శుకరంభాసంవాదము | 0 3 0 |
| నాటకములు. | |
| పాండవజననము | 0 9 0 |
| పాండవప్రవాసము | 0 12 0 |
| పాండవోద్యోగము | 0 10 0 |
| పాండవవిజయము | 0 12 0 |
| పాండవాశ్వమేధము | 0 12 0 |
| సుకన్య | 0 5 0 |
| పండితరాయచరిత్ర | 0 10 0 |
| మృచ్ఛకటిక | 0 12 0 |
| ముద్రారాక్షసము | 0 8 0 |
| దంభవామనము | 0 6 0 |
| అనర్ఘనారదము | 0 8 0 |

| | రు. అ. ప. |
|---|---|
| బాలరామాయణము | 1 0 0 |
| ఎడ్వర్డుపట్టాభిషేకము | 0 6 0 |
| మిసలేనియసు. | |
| పల్లెటూళ్ళపట్టుదలలు | 0 4 0 |
| అపూర్వకవితావివేచన | 0 4 0 |
| కాశీసహస్రము | 0 8 0 |
| అష్టకములు | 0 4 0 |
| విక్రమాంకదేవచరిత్ర | 0 8 0 |
| చంద్రప్రభచరిత్ర | 0 8 0 |
| గ్రామసింహము | 0 1 0 |
| కామేశ్వరీశతకము | 0 2 0 |
| శనిగ్రహము | 0 1 6 |
| శ్రీమానమామలశతావధానము | 0 3 0 |
| నానారాజసందర్శనము | 1 0 0 |
| శతావధానసారము | 0 12 0 |
| దేవీభాగవతము. | |
| (ప్రథమస్కంధము) | 0 10 0 |
| (ద్వితీయస్కంధము) | 0 6 0 |
| (తృతీయస్కంధము) | 0 12 0 |
| (చతుర్థస్కంధము) | 0 9 0 |

*కవితావిమర్శనము ...0 5 0

*బిడాలోపాఖ్యానము ...0 5 0

*ఇవి యితరుల గ్రంథములు.

☞ భారతనాటకములు 5 ను ఒకసారియే కొనువారగల కాఖరీదుకే అయిదు పుస్తకములు. నొకటే బైండుగా జేసినది పంపబడును.

1 దేవీభాగవతము.(5 వ స్కంధము)తయారయినది వెల 11 అణాలు.

2 కవిసింహగర్జితములు 1 నెలలో సిద్ధమగును.

కావలసినవారు బ్రహ్మశ్రీ శతావధానులు తిరుపతివేంకటేశ్వరకవులకు కాకినాడ సరస్వతీప్రెస్సుకుగాని లేక భైరవప్రెస్సు బందరుకుగాని వ్రాసికొనవలయును.

